# ఆంధ్రపత్రిక

316844



The Andhra Patrika, Madras, { Regd No 1118 Vol 34 No 73 WEDNESDAY 25 h JUNE 1947 వెల ఒకఅణా { Founder K. Nageswara Rao

# "సరిహద్దురాష్ట్రాన్ని బలవంతాన పాకిస్థాన్‌లో చేర్చడానికి బ్రిటిషువారి కుతంత్రం"

## తాము ఏమాత్రం సమ్మతించమని గఫర్ ఖాన్ హెచ్చరిక

### సైనికాశ్రయస్థాపనకు ఇది సామ్రాజ్యవాదుల పన్నాగమే నట

### స్వతంత్రపఠానిస్థాన్ ప్రాతిపదికపై లీగర్లతో రాజీకి సంసిద్ధత



హరిద్వారంలో ఈ మధ్య శరణార్థుల యోగక్షేమాలను విచారించి తెలుసుకుంటున్న గాంధీజీ, నెహ్రూ



పెషావరు, జూన్ 22: "బ్రిటిషువారు పఠానులపాలిటి శత్రువులు. సరిహద్దు రాష్ట్రమును ఏవిధముగానైనను పాకిస్థానులో చేర్చుటకు ఒత్తిడికలుగజేయుచున్నారు. పఠానులకు ఇష్టములేకపోయినను యీ రాష్ట్రమును పాకిస్థానులో చేర్పించి దీనికి సరిహద్దు రాజ్యముగానున్న రష్యాను ప్రతిఘటించుటకై బ్రిటిషువారిక్కడ సైనిక స్థావరములను ఏర్పాటు చేసుకోవలెనని ఆలోచిస్తున్నారు. కాని ఖుదైఖిద్మత్గారులు యీ రాష్ట్రంలో ఉన్నంతకాలమూ ఇక్కడ బ్రిటిష్ తంత్రము సాగనివ్వరు" అని ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ గారు నేడు బన్నూనగర బహిరంగసభలో ఉపన్యసిస్తూ పఠానులను ఉద్బోధించాడు.

పఠానులలో అంతఃకలహములను బ్రిటిషువారు కల్పించుచున్నారు. కాని, పఠానులు బ్రిటిషువారి చేతులలో కీలుబొమ్మలు కారాదు. పఠానిస్థాను అనే ప్రత్యేక స్వతంత్రరాష్ట్రము ఏర్పాటు చేయుటకు నేను సమ్మతిస్తాను. ఈ స్వతంత్ర పఠానిస్థాను కొరకు రాజ్యాంగవిధానము తయారుచేయుటకు లీగు ప్రముఖులను కూడా నేను ఆహ్వానిస్తున్నాను. "జల్మీ పాఖ్తూన్" అనే సంఘము ఏర్పడియున్నది. ఈ రాష్ట్ర గవర్నరుగా నుండిన సర్ ఒలాఫ్‌కరోగారు దీనిని సంతోషముల పాలొనర్చిరి. అందువల్ల యీ రాష్ట్రములో తిరిగి శాంతిని నెలకొల్పుటకై జల్మీ పాఖ్తూన్ అనే సంఘము ఏర్పడింది.

ఈ సరిహద్దు రాష్ట్రము పాకిస్తాన్‌లో చేరవలెనా, లేక స్వతంత్రమైన పఠానిస్తాన్‌గా ఉండవలెనా అనే విషయమును ప్రధాన ప్రశ్నగా తీసికొని క్రొత్త ఎన్నికలను జరిపే యెడల అందుకు మేము సిద్ధముగా ఉన్నాము. కాని, పాకిస్తానులో చేరవలెనా, హిందూస్తాన్‌లో చేరవలెనా అనే ప్రశ్నను పురస్కరించుకొని ఎన్నికలు జరుపుటకు మేము సిద్ధపడుటలేదు.

## సరిహద్దు 'రిఫరెండం'ను కాంగ్రెస్ బహిష్కరించేసూచన

### స్వతంత్రపఠానిస్థాన్ స్థాపనకు పోరాటం సాగుతుందని నెహ్రూ అభిప్రాయం

[ఇండియన్ యునైటెడ్ ప్రెస్]

హరిద్వారం, జూన్ 21 సరిహద్దు రాష్ట్ర భవిష్యత్తు విషయంలో కాంగ్రెస్ వైఖరిని అనుసరించవలసిందీ పండిట్ నెహ్రూ ఇక్కడ సరిహద్దు రాష్ట్ర కరణానుల సమావేశంలో ఉపన్యసిస్తూ తెలియజేశాడు. నెహ్రూ విశదీకరించిన ముఖ్యాంశాలు ఇవి:

(1) 'రిఫరెండం'ను నూటికి 99 పాళ్లు కాంగ్రెస్ బహిష్కరించింది.

(2) ఒకే పక్షానికి చెందినవారు 'రిఫరెండం'లో పాల్గొని, ఒక నిర్ణయాని వచ్చినట్లయితే, ప్రస్తుతం పనిచేస్తున్న డాII ఖాన్‌సాహెబు మంత్రివర్గం రాజీనామా ఇస్తుంది, వచ్చే ఎన్నికలలో పాకిస్తాన్ కావలెనా, పఠానిస్తాన్ కావలెనా అనేదాన్ని ప్రధాన సమస్యగా పెట్టుకొని పోటీ చేస్తుంది.

(3) సరిహద్దు రాష్ట్రానికి సత్వర భవిష్యత్తులో ఏమి సంభవించినప్పటికీ, స్వాతంత్ర్యప్రియులైన పఠాను ప్రజలు స్వతంత్ర పఠానిస్తాన్ స్థాపనకై తమ పోరాటాన్ని సాగిస్తూనే వుంటారు.

(4) సరిహద్దు రాష్ట్రానికి, పంజాబుకూ చెందిన అల్పసంఖ్యాక వర్గాలు తమతమ రాష్ట్రాలనువిడిచి, ఇదివరలో కలిగిన నష్టానికి పరిహారాన్నీ, భవిష్యత్భద్రతను ఇప్పించవలసిందని ఆయా ప్రభుత్వాలను కోరాలి.

### బెంగాలులో త్వరలోనే 93-వ సెక్షను అమలు

కలకత్తా, జూన్ 23 బెంగాలులో త్వరలోనే 93 వ సెక్షను పరిపాలన ఏర్పడబోతున్నదని ఇక్కడి కాంగ్రెస్, లీగు వర్గాలలో విచారించగా తెలుస్తున్నది. వచ్చే శనివారంలోపుగానే 93 వ సెక్షను పాలన రావచ్చు. ప్రాంతీయ మంత్రివర్గాలు నెలం త్వరలో ఏర్పడినా ఏర్పడవచ్చు.

## సరిహద్దులో రిఫరెండం

### గవర్నర్ జనరల్ అధికార ప్రకటన

న్యూఢిల్లీ జూన్ 23 బ్రిటిషుప్రభుత్వ పథకాన్ని అనుసరించి సరిహద్దు రాష్ట్రములో రెఫరెండము తీసుకొనే విషయములో అవలంబించవలసిన పద్ధతులను గురించిన్నీ ఇప్పుడు ఉన్న రాజ్యాంగ పరిషత్తుకున్నూ క్రొత్త రాజ్యాంగపరిషత్తుకున్నూ పంజాబు రెండుభాగాలవారున్నూ తాజాగా సభ్యులను ఎన్నుకొనే విషయాన్ని గురించిన్నీ ఈ విధముగా యీరోజున వైశ్రాయి కమీషనర్ ప్రకటనలు చేసినారు.

బ్రిటిషుప్రభుత్వమువారు జూన్ 3 వ తేదీన చేసిన ప్రకటనలో రెండవ 8 వ పేరాలలో చెప్పిఉన్న ప్రకారము జూన్ 23-వ తేదీన పంజాబురాష్ట్రాన్ని విభాగము చేయవలెనని పంజాబురాష్ట్ర శాసనసభవారు నిశ్చయించినారు.

అందువల్ల ఇప్పుడు 21-వ పేరా ప్రకారము సరిహద్దురాష్ట్రములో రెఫరెండము తీసుకొనేటందుకు గవర్నరుజనరల్ ఆ ప్రకటనలో ఉన్న 11-వ పేరానుబట్టి యీ విధముగా నిర్ణయించినాడు.

(1) సరిహద్దురాష్ట్ర శాసనసభకు ఆయా టెరిటోరియల్ నియోజకవర్గాల తాలూకు ఎన్నికల జాబితాలలో పేరున్న వోటర్లందరూ రెఫరెండములో పాల్గొంటారు.

(2) ఈ రెఫరెండము వ్యవహారాన్ని అంతా నడిపేటందుకు అందుకు అవసరము అయిన ఏర్పాట్లు అన్నీ చేసేటందుకున్నూ రెఫరెండము కమీషనర్ ఉండవలెను.

(3) రెఫరెండము తీసుకొనేటందుకు అవసరమైన చర్యలను అన్నిటినీ రెఫరెండము కమీషనరు అమలుపరచవలెను.

(4) సరిహద్దురాష్ట్ర ప్రభుత్వమువారికిన్నీ గవర్నర్ జనరల్‌కున్నూ రెఫరెండము పర్యవసానాన్ని రెఫరెండము కమీషనరు తెలియజేయవలెను.

### పంజాబులో కొత్తఎన్నికలు

పంజాబురాష్ట్రాన్ని విభజించవలెనని నిర్ణయించినారు కనుక ఈ దిగువవాటిని అమలుపరచవలెను.

(1) ఈ ప్రకటనతో ఇప్పుడున్న రాజ్యాంగ పరిషత్తుకు ఇదివరలో పంజాబునుంచి ఎన్నికఅయి రాజ్యాంగపరిషత్తులో సభ్యులుగా వారి సభ్యత్వాలు రద్దు అయి పోతున్నవి.

(2) జూన్ 10 తేది ప్రకటనములో 3-4 పేరాగ్రాఫుల్లో నిర్ణయించిన ఆయా నియోజకవర్గాలకు పంజాబు రాష్ట్ర శాసనసభవారు వారి క్రమాన్నిబట్టి సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటుతో క్రొత్తరాజ్యాంగ

(8 వ పేజీ చూడుడు)

## కొత్త సరిహద్దురాష్ట్రం ఏర్పడవలెనని సూచన

### జులై 3-న యు. పి. ప్రతినిధుల సమావేశం

మీరటు, జూను 23: సంయుక్తరాష్ట్రాలలో చేరిన మీరటు, డివిజను, ఆగ్రా డివిజనులో చేరిన ఆగ్రా, మథుర, ఏటా జిల్లాలున్నూ, రోహిలఖండ డివిజనులోని బిజనోరు, మురాదాబాదు, బుడాన్ జిల్లాలున్నూ గార్వాల్ జిల్లాయున్నూ చేరి హిందూస్తాను కాక సరిహద్దు రాష్ట్రముగా ఏర్పడవలెనను విషయమై చర్చించుటకు ఆ జిల్లాల తాలూకు సంయుక్తపరగణాల అసెంబ్లీ ప్రతినిధులు జూలై 3 తేదిని మీరటులో సమావేశమయ్యెదరు. పైచెప్పిన జిల్లాలు మాత్రమేగాక, హిందూస్తాన్ యూనియను ప్రభుత్వములో చేరుచున్నటువంటి అంబాలా డివిజను జలంధరు డివిజనులలోని 12 జిల్లాలుకూడా పైచెప్పిన సరిహద్దురాష్ట్రములో చేరవలెనను విషయముకూడా నిర్ణయింపబడును.

## 'ఈకృత్రిమవిభేదాలు తొలగిపోయి త్వరలో ఐక్యభారతం ఏర్పడగలదు'

### పంజాబు విభజన: కాంగ్రెస్ నాయకుడు లాలా భీమసేన్ సచార్ దృఢవిశ్వాసం

లాహోర్, జూన్ 23 జాతి, మతకృత్రిమ భేదాలచే విభజింపబడ వీలులేదు కాబట్టి, భౌగోళిక సంబంధాలవల్ల భారత ప్రజానీకం తిరిగి త్వరలోనే ఐక్యమయి ఐక్యభారతదేశాన్ని స్థాపించగలదని పంజాబ్ శాసనసభ కాంగ్రెస్‌పార్టీనాయకుడు లాలా భీమసేన్ సచార్ ఒక ప్రకటనలో అన్నాడు.

"అనవసరంగా జరిగింది రాష్ట్రవిభజనే నిర్ణయమయింది ఒక పంజాబీగా నేనందుకు విచారిస్తున్నాను కాని హిందూస్థానా పాకిస్థానా అనే ప్రశ్న తేలినపుడు, ఇంతకన్న గత్యంతరంలేదు అంతా జరిగిపోయినాక ఇప్పుడు ఒకరినొకరు నిందించుకుని లాభంలేదు.

మన జీవితాలలో ఇది అత్యంత క్లిష్ట సమయము. మూడైనా, మన కార్యములు కోటానుకోట్ల ప్రజల భవిష్యత్తును నిర్ణయించును ఈ సమయంలో మనకు ముఖ్యంగా కావలసినది సౌహార్ద్రభావము, ఎన్నో చిక్కు సమస్యలు కొంచెమయినా కష్టంలేకుండా పరిష్కరించుకోటానికి యిదేమార్గం ఎంతో పెద్దరకపు భేదాభిప్రాయాలు సామరస్యంతో పరిష్కరించుకోగలిగి ఇందుకు విశాల హృదయంతోను, దూరదృష్టితోను ప్రవర్తించాలి దురదృష్టవశాత్తు లోగడ ఇవే విస్మరింపబడినవి కాని ఇదే పరిస్థితిలోవున్న ఇతర ప్రజలు సామరస్యంతో పనిచేసుకోగలిగినారు మనమాత్రం ఎందుకు చేసుకోకూడదు? ఈ విధంగానే మనం కించితయినా కష్టంలేకుండా విడిపోగలం మనం తిరిగి ఐక్యం కావటానికి ఇదే తోడ్పడగలదు"

### స్వర్ణసింగ్ ప్రకటన

పంజాబు శాసనసభలో పాంథిక్ పార్టీనాయకుడైన సర్దారు స్వర్ణసింగ్, పంజాబు విభజనను గూర్చి ఇట్లు ప్రకటించారు: పంజాబు ప్రస్తుత ప్రజాపరిషత్తులోనే వుండవలెనని మేము మొదటినుండి భావించితిమి తదనుగుణంగానే, ఈరోజు 2 వ సమావేశములోను, సంయుక్త సమావేశం కావలెనని కోరితిమి సంయుక్త సమావేశం ప్రస్తుత ప్రజాపరిషత్తులో చేరవలెనని నిశ్చయించి ఐక్యభారతదేశానికి దారి తీయగలదని తలంచితిమి కాని అధిక సంఖ్యాకులైన ముస్లిం సభ్యులు, తమ సంఖ్యాబలముచే పంజాబు విభజన నేగాక పంజాబునకు క్రొత్త ప్రజాపరిషత్తులోనికి లాగ ప్రయత్నించిరి కాబట్టి తూర్పు పంజాబు విభజ కోరుటకన్న గత్యంతరం లేకపోయింది భారత విభజనే స్థిరమైతే పంజాబు కూడా విభజించితీరవలెను పంజాబులోని హిందూ సిక్కు, నిమ్నజాతి ప్రతినిధులందరూ పంజాబు ప్రస్తుత

(2-వ పేజీ చూడుడు)

## ఉభయరాజ్యాంగపరిషత్తులకు తూర్పు పశ్చిమ పంజాబ్ సభ్యులు

### జులై 4న ఎన్నిక: గవర్నర్ ప్రకటన

లాహోరు, జూన్ 23: కొత్త రాజ్యాంగ పరిషత్తుకున్నూ ఇప్పుడు ఉన్న రాజ్యాంగ పరిషత్తుకున్నూ పంజాబురాష్ట్ర శాసనసభా సభ్యులు తూర్పు భాగమువారున్నూ పడమటి భాగమువారున్నూ సభ్యులను ఎన్నుకొనే విషయములో గవర్నరు యీదిగువ ప్రకటనము చేసినాడు.

రెండు భాగాలవారున్నూ నామినేషన్లు జులై 2 వ తేదీలోపల దాఖల్‌చేయవలెను. నామినేషన్ల పరిశీలన ఆరోజునే జరుగుతుంది. ఉపసంహరణలను జులై 3 వ తేది మధ్యాహ్నము అంగీకరిస్తారు. జులై 4 వ తేదీన ఎన్నికలు జరుగవలెను. ఆరోజున ఉదయము 9 గంటలకు తూర్పు పంజాబు భాగమువారున్నూ ఉదయము 10 గంటలకు పడమటి భాగమువారున్నూ సభ్యుల ఎన్నికలు జరపవలెను. పడమటిభాగానికి దివాన్‌బహదూర్ యస్. సింఘాయున్నూ తూర్పుభాగానికి సర్దార్ కపూర్‌సింగున్నూ అధ్యక్షత వహిస్తారు.

### సిల్హెట్ రిఫరెండం జులై 6, 7 లన

సిల్హెటు, జూను 23 సిల్హెటుజిల్లా 'రిఫరెండం' జులై 6, 7 తేదీల్లో జరుగుతుంది తూర్పు బెంగాల్లో సిల్హెట్ జేరాలనేవారు 'గొడ్డలి' గుర్తు వేసిన పెట్టలోనూ, అస్సాంలోనే వుండాలనేవారు "పూరిల్లు" గుర్తుగల పెట్టలో తమ వోట్లు వేస్తారు సిల్హెటుజిల్లా జైలులో వున్న లీగు రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేశారు.



## భారతదేశము స్వతంత్రమౌను!

*ఈ సందర్భమున ఒక 'ఫ్రీ ఇండియా పాలిసీ' తీసుకొని సంబరము చేయుడు.*

ఆత్మీయులు వీడిపోవచ్చును.
మీ గృహమునకు అగ్ని ప్రమాదము కలుగవచ్చు
మీ కారునకు ప్రమాదము తగులవచ్చు

అయినను ఫ్రీ ఇండియా జనరల్ పాలిసీ మాత్రము ఎన్నటికి తప్పిపోదు

జాతీయ సౌభాగ్యమును అతి చౌకఖర్చుతో సంరక్షించుడు.

## ఫ్రీ ఇండియా జనరల్ ఇన్సూరెన్సు కం. లి.

హెడ్డాఫీసు: బొంబాయి.
బ్రాంచీలు ఇండియా అంతటను సింహళములోను ఏజెన్సీలున్నాయి.

ADARTS (DELHI)

